# ANDHRA SREEBHASHYA.

# ఆంధ్రశ్రీభాష్యము.

భగవద్రామానుజాచార్యులవారిచే
బోధాయనవృత్త్యనుసారముగా రచియింపఁబడిన
బ్రహ్మసూత్రభాష్యము.

హానరెబిల్ శ్రీరాజాగోడేనారాయణగజపతిరాయనింగారి

సెలవుప్రకారము

శ్రీపరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి అయ్యవారలుగారిచేఁ
దెనుఁగు సేయఁబడి

వారి సెలవుప్రకారమే

ముద్రింపింపఁబడినది.

౧ సంచిక.

Published by Sree Paravastu Sreenivasa
Jagannadhaswami Ayyavaralugaru.

Printed by D. Guranna, at the Arsha Press.

Vizagapatam. 1892.

ము (మత్ అను దాని నర్థమునిచ్చెడి ఇన్ మొదలగునది) కానఁబడినది-
వేఱుగాఁ దెలియఁబడుటకును ఉండుటకును తగని ద్రవ్యములకు అట్లు
కనఁబడుటలేదు- అవివిశేషణములగుట సామానాధికరణ్యముచేతఁ
దెలియఁదగినదియె-

౧౮౯. ఆత్మ, కర్మములచేత, గోవును అశ్వంబును మనుష్యుఁడు
ను దేవుఁడును పురుషుఁడును స్త్రీయును నపుంసకుఁడును అయ్యెననుచో
ట, మనుష్యాది శరీరములు ఆత్మకు ప్రకారములగుట, మొండియా
వు బోడియావు తెల్లనిబట్ట నల్లనిబట్ట అనుచోట జాతిగుణము
లవలెనేయని ఇష్టమయ్యెనేని అప్పుడు జాతివ్యక్తులకువలె ప్రకా
రంబును ప్రకారియునగు శరీరాత్మలకుఁ గూడ నియతముగా సహప్ర
తిపత్తి (రెండును ఒకసారే తెలియఁబడుట) కావలయును- ఇట్లు క
నఁబడుటలేదు- గోత్వాదులనువలె, నియతముగా ఆత్మయాధార
ముగాఁ గలుగునట్లు ఆత్మతోఁగూడ మనుష్యాది శరీరమును చూచు
చుండుటలేదుగదా- కాఁబట్టి మనుష్యుఁడు ఆత్మయని చెప్పెడి సామా
నాధికరణ్యము లాక్షణికమె (అముఖ్యార్థమును బట్టి వచ్చినదియె)-
అనియందురు — ఇది ఇట్లుకాదు- మనుష్యాది శరీరములుగూడ ఆత్మయొ
క్కటియె ఆధారముగాఁ గలిగియుండుటయు దాని యొక్క దాని
కొఱకె అయియుండుటయు దానికి ప్రకారములగుటయు జాత్యాదుల
తో సమానమె- ఆత్మయొక్కటియె ఆధారముగాఁ గలిగియుండుట ఆ
త్మతో వియోగము కలిగినతోడనె శరీరము నశించుట వలనఁ దెలియఁబ
డుచున్నది- ఆత్మైకప్రయోజనత్వముగూడ వాని (ఆత్మయొక్క) కర్మ
ములఫలములను అనుభవించుటకొఱకె కలుగుటవలనఁ దెలియఁబడు
చున్నది- ఆత్మకు ప్రకారమగుటయును, దేవుఁడు మనుష్యుఁడు అని
యిట్లు ఆత్మకు విశేషణముగానె తోఁచుటవలన తెలియఁబడుచు
న్నది- ఇవియెకదా గవాది శబ్దములు వ్యక్తిపర్యంతమగుటయందు హేతు
వు- ఇట్టి స్వభావము లేక పోవుటవలననె దండము మొదలగునవి విశేష
ణములగునప్పుడు దండీ కుండలీ అని మత్వర్థీయప్రత్యయము కలుగుచు
న్నది- దేవమనుష్యాది వ్యక్తులు ఆత్మ ఒక్కటియె ఆధారముగాఁ గలుగు

టయును, దానియొక్క దానికొఱకే అయియుండుటయును, దానికి ప్రకారమగుటయు ననెడిస్వభావములు కలవగుటవలన దేవుఁడును మనుష్యుఁడును ఆత్మయని లోకంబునందును వేదంబునందును సామానాధికరణ్యముతో వ్యవహరించుట కలుగుచున్నది. జాతివ్యక్తులు రెండును నియతముగాఁగూడనె తెలియఁబడుట, రెండును చక్షుస్సు (కన్ను) చేత తెలియఁబడునవి యగుటవలన. ఆత్మ కన్నుచేఁ దెలియఁబడఁదగనిదిగాన కన్నుతో శరీరమును గ్రహించు సమయమున ఆత్మ గ్రహింపఁబడదు. వేఱుగా గ్రహింపఁబడఁదగిన దానికి, ప్రకారముగానే యుండుటయనెడిస్వరూపము దుర్ఘటమని చెప్పఁగూడదు. జాత్యాదులవలె, అదియొక్కటియె యాధారముగాఁగలిగియుండుట, దానియొక్క దానికొఱకే యయియుండుట, దానికివిశేషణమగుట, అనువానిచే శరీరముగూడ దానికి(ఆత్మకు) ప్రకారమగుటయె ముఖ్యస్వభావముగాఁగలదిగాఁ దెలియఁబడుచున్నదిగదా. సహోపలంభనియమము (తప్పక రెండునొక్కమాఱు తెలియఁబడుట) ఒక్క సాధనముచేఁ దెలియఁబడుటను పట్టివచ్చునదని చెప్పఁబడినది. ఎట్లన్నను, పృథివీమొదలగునది గంధము రసము మొదలగుదానితో సంబంధించియుండుట స్వాభావికమైనను, అదిచక్షుస్సుచేత గ్రహింపఁబడకయున్నది. ఇట్లేచక్షుస్సుచేత గ్రహింపఁబడుచున్న శరీరము ఆత్మకు ప్రకారమగుటయె ముఖ్యమైన స్వభావముగాఁగలదియైనను అట్లు గ్రహింపఁబడుటలేదు. ఆత్మను గ్రహించుటయందు చక్షుస్సునకు సామర్థ్యము లేదుగదా. ఇంతమాత్రముచేత శరీరము దానికి (ఆత్మకు) ప్రకారమగుటయె స్వభావముగాఁగలది కాకపోదు. దానికి ప్రకారమగుట ముఖ్యస్వభావముగాఁ గలుగుటయె సామానాధికరణ్యమునకు మూలము. ఆత్మకు ప్రకారమగుటను తెలియఁజేయఁజాలెడి శబ్దము, ప్రకారమగుటను దెలియఁజేయుచునేయున్నది.

౧౫. శబ్దవ్యవహారమునఁ గూడ శరీరమును జెప్పెడి శబ్దముచేత శరీరము మాత్రమె చెప్పఁబడుచున్నదిగాన ఆత్మపర్యంతమగుట శరీరశబ్దమునకు లేదని శంక తోఁచును. ఇట్లు కాదు. పదార్థముల యేర్పాటును చూపుటకై ఆత్మకు ప్రకారమైన శరీరమును మా

త్రమే నిరూపించుటవలన ఇదిసమర్థకశబ్దము. ఎట్లంటేని- గోత్వముశుక్లత్వము ఆకృతి గుణము ఇత్యాది శబ్దములవలెనె.

౧౫౧. కాఁబట్టి గవాదిశబ్దములవలె మనుష్యాది శబ్దములు గూడ ఆత్మపర్యంతములే. ఇట్లే దేవ మనుష్యాది శరీరములతోఁగూడిన జీవులుపరమాత్మకు శరీరమగుటను ఆతనికి (పరమాత్మకు) ప్రకారములుగాన జీవాత్మనుజెప్పెడి శబ్దములన్నియును పరమాత్మపర్యంతములే. ఇందువలన పరబ్రహ్మమునకు ప్రకారమగుటనె చేతనాచేతన వస్తువు పదార్థముగాన, ఆతనిసామానాధికరణ్యమునఁ బ్రయోగించుట కలుగుచున్నది. ఈయర్థము వేదార్థసంగ్రహమున సమర్థింపఁబడినది. ఈశరీరాత్మభావరూపమగుతాదాత్మ్యమునె (౪॥౧॥౩॥సూ) ఆత్మేతితూపగచ్ఛన్తి గ్రాహయన్తి చ (బ్రహ్మము ఆత్మయనియెఉపాసింపఁదగినది. అట్లె ఉపాసింపుచున్నారు. శాస్త్రములును తెలియఁజేయుచున్నవి.) అనిసూత్రకారుఁడు చెప్పఁగలఁడు. ఆత్మేత్యేవతు గృహ్ణీయాత్ (ఆత్మయనియెగ్రహించునది) అనివాక్యకారుఁడును చెప్పెను.

౧౫౨. ఇందుసత్త్వంబేదయన్నను— అచేతనవస్తువునకును చేతనవస్తువునకును పరబ్రహ్మమునకును భోగ్యమగుటయును భోక్తయగుటయును ఈశ్వరుఁడగుటయుననెడి స్వరూపభేదమును కొన్ని శ్రుతులు చెప్పుచున్నవి.

(శ్వేతా॥౪॥౯మ॥) అస్మాన్మాయీ సృజతేవిశ్వమేతత్తస్మింశ్చాన్యో మాయయాసన్నిరుద్ధః (మాయగలవాఁడు దీనివలన ఈజగత్తును సృజించుచున్నాఁడు. మఱియొకఁడు దానియందుమాయచేతనిరోధింపఁబడియున్నాఁడు.)

(శ్వేతా॥౪॥౧౦మ) మాయాన్తు ప్రకృతింవిద్యాన్మాయినన్తుమహేశ్వరమ్ (ప్రకృతిని మాయనుగా నెఱుఁగనది. మహేశ్వరుని మాయగలవానిగా నెఱుఁగనది.)

(శ్వేతా॥౧॥౧౦మ॥) క్షరంప్రధాన మమృతాక్షరంహరః క్షరాత్మానావీశతేదేవఏకః (ప్రధానముక్షరము. జీవుఁడు అక్షరుఁడును అమృతుఁడును. ఒకఁడేదేవుఁడు క్షరమునును ఆత్మనును ఏలుచు

నాఁడు) అమృతాక్షరం హరః అని భోక్త నిర్దేశింపఁబడుచున్నాఁడు- ప్రధానమును తనకు భోగ్యమునుగా స్వీకరింపుచున్నాఁడుగాన హరుఁడు-

(శ్వేతా॥౬ అ॥౯మ॥) స కారణం కరణాధిపాధిపో న చాస్య కశ్చి జ్జనితా న చాధిపః (ఆతఁడు కారణము- ఇంద్రియములకు అధిపతులైన జీవులకు అధిపతి- ఈతనికి కర్తయొకఁడును లేఁడు- ఈతనికి అధిపతియును లేఁడు)

(శ్వేతా॥౬ అ॥౧౬మ) ప్రధానక్షేత్రజ్ఞ పతిర్గుణేశః (ప్రధానమునకును జీవులకును అధిపతియైనవాఁడు)

(తైత్తి॥ నా॥) పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ంశాశ్వతగ్ం శివమచ్యుతమ్ (జగత్తునకు అధిపతియైనవాఁడు- ఆత్మలకు ఈశ్వరుఁడు- శాశ్వతుఁడు- మంగళకరుఁడు- నిర్వికారుఁడు-)

(శ్వేతా॥౧అ॥౯మ) జ్ఞాజ్ఞౌ ద్వావజావీశనీశౌ (ఒకఁడు సర్వజ్ఞుఁడును, మఱియొకఁడు అజ్ఞుఁడును- ఒకఁడు ఈశ్వరుఁడును, మఱియొకఁడు ఈశ్వరుఁడు కానివాఁడును- ఇద్దఱును పుట్టనివారు)

(కఠ॥౫వల్లి॥౧౩మ) నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్ (నిత్యుఁడును ఒకఁడునగు నే చేతనుఁడు నిత్యులును అనేకులునగు చేతనులకోరికలను చేయుచున్నాఁడో)

(శ్వేతా॥ ౧అ॥ ౧౨మ) భోక్తా భోగ్యం ప్రేరితారంచ మత్వా (భోక్తను అనఁగా జీవునిని, భోగ్యమును అనఁగా అచేతనమునను, ప్రేరకుని అనఁగా ఈశ్వరునిని, తలంచి)

(ముణ్డ॥౩॥౧॥౧॥) తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి (వారిద్దఱిలో నొకఁడు మధురమైన పండ్లను తినుచున్నాఁడు- మఱియొకఁడు తిననివాఁడై అంతటను ప్రకాశింపుచున్నాఁడు-పండు అనఁగా కర్మఫలము- దానిఁదినువాఁడు జీవుఁడు-మఱియొకఁడు ఈశ్వరుఁడు-)

(శ్వేతా॥౧అ॥౬మ) పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా జుష్టస్తత స్తేనామృతత్వమేతి (ఆత్మను ఈశ్వరునిని వేఱుగాఁద

మ్॥ ప్రకృతింస్వామవష్టభ్యవిసృజామిపునః పునః। భూతగ్రామమిమంకృత్స్నమవశం ప్రకృతేర్వశాత్ (ఓకుంతీపుత్రుడా! కల్పాంతమునందు సమస్త భూతములును నా ప్రకృతినిబొందుచున్నవి. వెండియు వానిని కల్పాదియందుసృజింపుచున్నాడను. నాయేదియగు ప్రకృతిని పరిణమింపజేసి ప్రకృతివశమువలన పరాధీనమైన ఈ సమస్త భూతసముదాయమునుమాటిమాటికిని సృజింపుచుందును)

(భగ॥ ౯అ॥౧౦శ్లో) మయాధ్యక్షేణప్రకృతిః సూయతే సచరాచరమ్। హేతునానేనకౌన్తేయజగద్విపరివర్తతే (అధ్యక్షుడనైననాచే సంకల్పింపబడినదైప్రకృతిజంగమస్థావరరూపమైన జగత్తునుకనుచున్నది. ఓకుంతీపుత్రుడా! ఈ హేతువుచేత నేజగత్తు నడచుచున్నది)

(భగ॥౧౪అ॥౩శ్లో) మమయోనిర్మహద్బ్రహ్మతస్మిన్గర్భం దధామ్యహమ్। సంభవస్సర్వభూతానాంతతో భవతిభారత (ఓభరతవంశమువాడా! అన్నిటికి కారణమైన నాయొక్క గొప్ప ప్రకృతి ఏదికలదో దానియందు గర్భమును అనగా చేతనసముదాయమును నేను ఉంచుచున్నాను. దానివలన సమస్తభూతములును పుట్టుటకలుగుచున్నది) జగత్తునకు కారణభూతమైనాయదియైన గొప్పబ్రహ్మము అనగా ప్రకృతియనుపేరుగల భూతసూక్ష్మమైన అచేతనవస్తువు ఏదికలదో దానియందుచేతనుడనెడి గర్భమును ఎందువలన చేర్చుచున్నాడనో అందువలన, నావలనజేయబడిన చేతనాచేతనసంసర్గమువలన. అచేతనమిశ్రంబులగు దేవాదిస్థావరాంతములైన సమస్తభూతములకును పుట్టుకకలుగుచున్నది-అనియర్థము-

౧౫౪ కొన్నిశ్రుతులు భోక్తృభోగ్యరూపముగా (అనుభవించువాడును అనుభవించునదియు నగునట్లు)నున్న చేతనాచేతనములు అన్నియవస్థలలోనున్నవియును పరమపురుషునకు శరీరములై ఆతనిచే నియమింపబడునవిగాన ఆతనినివిడిచి యుండకపోవుటనునే పరమపురుషుడు ఆత్మయగుటనును జెప్పుచున్నవి-

(బృ॥ఉ॥౭॥బ్రా॥౩ఖం॥) యఃపృథివ్యాంతిష్ఠన్ పృథివ్యాఅన్తరోయంపృథివీనవేద యస్యపృథివీశరీరమ్ యఃపృథివీమన్తరోయమయ

తి(ఎవఁడు పృథివియందున్నవాఁడై పృథివికిలోపలివాఁడో, ఎవనిని పృథివిఎఱుఁగదో, ఎవనికి పృథివి శరీరమో, ఎవఁడు పృథివిలోపలివాఁడై నియమింపుచున్నాఁడో)అని మొదలువెట్టి (మాధ్య॥బృహా॥) యఆత్మని తిష్ఠన్నాత్మనోన్తరోయమాత్మా నవేదయస్యాత్మాశరీరమ్ యఆత్మానమన్తరోయమయతి సతఆత్మాన్తర్యామ్యమృతః (ఎవఁడుఆత్మయందున్నవాఁడైఆత్మకు లోపలివాఁడో ఎవనిని ఆత్మ ఎఱుఁగదో,ఎవనికి ఆత్మశరీరమో, ఎవఁడు ఆత్మను లోపలివాఁడై నియమింపుచున్నాఁడో, యీఁతెఁడునీకుఅంతర్యామి) అనియును-

ఇట్లే (సుబా॥ ౭ఖం॥) యఃపృథివీమంతరే సంచరన్ యస్యపృథివీశరీరం యంపృథివీనవేద (ఎవఁడుపృథివిలోపలను సంచరింపుచున్నాఁడో, ఎవనికి పృథివిశరీరమో, ఎవనినిపృథివి ఎఱుఁగదో, అని మొదలువెట్టి) (సుబా॥ ౭ఖం॥) యోఽక్షరమంతరేసంచరన్యస్యాక్షరం శరీరంయమక్షరంనవేద యోమృత్యుమంతరే సంచరన్ యస్యమృత్యుశ్శరీరంయంమృత్యుర్నవేదఏష సర్వభూతాన్తరాత్మాపహతపాప్మా దివ్యోదేవ ఏకోనారాయణః (ఎవ్వఁడు అక్షరములోపలసంచరింపుచున్నవాఁడో ఎవ్వనికిఅక్షరము శరీరమో, ఎవ్వనిని అక్షరమెఱుఁగదో, ఎవ్వఁడు మృత్యువులోపల సంచరింపుచున్నాఁడో, ఎవ్వనికి మృత్యువు శరీరమో, ఎవనినిమృత్యువు ఎఱుఁగదో, ఇతఁడు సమస్తభూతములకునుఅంతరాత్మయును నిర్దోషుఁడును పరమపదమునఁనుండువాఁడును దేవుఁడును ఒకఁడునగునారాయణుఁడు) ఇచ్చట మృత్యుశబ్దము తమస్సనెడి సూక్ష్మావస్థగలయచేతనమును చెప్పుచున్నది- ఈయుపనిషత్తునందె (సుబా॥ ౨ఖ॥) అవ్యక్తమక్షరేలీయతే అక్షరంతమసిలీయతే (అవ్యక్తము అక్షరమునలయమును బొందుచున్నది, అక్షరముతమస్సున లయమును బొందుచున్నది) అని చెప్పుటవలన-

(నిత్తి॥ ౧౧అను॥) అంతఃప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా (లోపలఁబ్రవేశించియున్నవాఁడు జనులనుశాసించువాఁడు,అన్నిటికినాత్మయైనవాఁడు) అనియును శ్రుతిశెప్పెడు-

౧౫౫- కొన్ని శ్రుతులు కార్యావస్థలోని జగత్తును కారణావస్థలోని

జగత్తును స్వరూపముగాఁగలవాఁడై పరమపురుషుఁడే యున్నాఁడను నీయర్థమును తెలియఁజేయుటకై కార్యావస్థంబును కారణావస్థంబునగు జగత్తుఆతఁడె యనిచెప్పుచున్నవి-

(ఛాం॥ ౬।౨॥౩॥) సదేవసోమ్యేదమగ్రఆసీదేకమేవాద్వితీయం- తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోసృజత- (ఈకనఁబడునది మొదటను సత్తైయుండెను- ఒకటైయుండెను- రెండవది లేనిదైయుండెను, అది తాననేకములు కావలయుననియు పుట్టవలయుననియుం జూచెను- అదితేజస్సును సృజించెను-) అనిమొదలువెట్టి (ఛా॥౬।౮।౬॥) సన్మూలాస్సోమ్యేమాస్సర్వాః ప్రజాస్సదాయతనాస్సత్ప్రతిష్ఠా (౭)ఐతదాత్మ్యమిదంసర్వం తత్సత్యంస ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో (ఓసోమ్యుఁడా [సోమయాగమునకుతగినవాఁడా] ఈప్రజలందఱును సత్తుమూలముగాఁగలవారు అనఁగా సత్తువలనఁగలిగినవారు- సత్తుఆధారముగాఁగలవారు సత్తుప్రతిష్ఠగాఁగలవారు అనఁగా సత్తునందులయమునుబొందువారు- ఇదియంతయును ఈతఁడాత్మగాఁగలది- అదినిజము- అతండెఆత్మ- ఓశ్వేతకేతూ! అదినీవు స్వరూపముగాఁగలది)

(తై॥ ఆన॥ ౬అను॥) సోకామయత బహుస్యాంప్రజాయేయేతి। సతపోతప్యత। సతపస్తప్త్వా। ఇదగ్ సర్వమసృజత (అతఁడు, నేనుఅనేకములు కావలయును, నేనుపుట్టవలయును, అనిసంకల్పించెను- అతండు ఆలోచనమునుచేసెను- అతఁడుఆలోచనను చేసిఈకనఁబడునది ఏదిగలదో దీనినంతను సృజించెను) అనిమొదలువెట్టి (తై ఆన॥౬అను) సత్యంచానృతంచ సత్యమభవత్ (చేతనా చేతనస్వరూపమయ్యెను పరబ్రహ్మము సత్యమె అనఁగాతనస్వభావముతో నున్నదే అయ్యెను.) ఇవిమొదలగు శ్రుతులు గలవు-

౧౫౬- ఇచ్చట గూడశ్రుత్యంతరసిద్ధమైన చేతనాచేతనములకును పరమపురుషునకును గలస్వరూపవివేకము అనఁగా స్వరూపవైలక్షణ్యము జ్ఞాపకము చేయఁబడినది- (ఛా॥ ౬॥ ౩॥౨) హంతాహమిమాస్తిస్రోదేవతా అనేన జీవేనాత్మనాను ప్రవిశ్యనామరూపేవ్యాకరవాణి (నేనుఈమూఁడుదేవతలనుశరీరమైన ఈజీవుని ద్వారమునఁ

జొచ్చి నామరూపములను పర్చుపలయును- అని ఆయీదేవతసంకల్పించెను- హాంతఅనునది సంతోషమును దెలుపును) {తై॥ ఆన॥ ౬ అను॥} తత్సృష్ట్వా। తదేవానుప్రావిశత్। తదనుప్రవిశ్య। సచ్చత్యచ్చాభవత్। విజ్ఞానంచావిజ్ఞానంచ। సత్యంచానృతంచ సత్యమభవత్ (దానిని సృజించి దానిని జొచ్చెను- దానిని చొచ్చి వికారములేనిదియును వికారముకలదియును అయ్యెను- తెలివిగలదియును తెలివిలేనిదియును అయ్యెను- చేతనాచేతనస్వరూపమగుచు బ్రహ్మము నిర్వికారమె అయ్యెను-) అనేనజీవేనాత్మనానుప్రవిశ్య అని జీవుఁడు బ్రహ్మాత్మకుండగుట చెప్పఁబడినది- అదిఒకటిఁడు శరీరంబును మఱియొకటిఁడు ఆత్మయును అగుటచేఁగలిగినదని, తదనుప్రవిశ్య। సచ్చత్యచ్చాభవత్। విజ్ఞానంచా విజ్ఞానంచ। అనుశ్రుతితో సమన్వయము చేయుటవలన తోఁచుచున్నది- ఇట్టి నామరూపవ్యాకరణమె (బృ ౩॥౪॥౭) తద్ధేదంతర్హ్యవ్యాకృతమాసీత్। తన్నామరూపాభ్యాంవ్యాక్రియత (ఇయ్యదిఅప్పుడు నామరూపముల యేర్పాటులేనిదైయుండెను- అది నామరూపములతో సేర్పఱుపఁబడెను-) అను శ్రుతియందుఁగూడ చెప్పఁబడినది- కాఁబట్టి కార్యావస్థగలవాఁడును కారణావస్థగలవాఁడును స్థూలసూక్ష్మములైన చేతనాచేతన వస్తువులు శరీరముగాఁగలపరమపురుషుఁడె కాన, కారణము కంటె కార్యము వేఱుకాదుగాన, కారణము తెలియుటచేత కార్యముగూడ తెలియఁబడుటను, ఏకవిజ్ఞానముచే సర్వవిజ్ఞానంబును, మనకు కావలసినది, తెన్నగాఁ గుదిరినది- అహమ్ఇమాస్తి స్రోదేవతాః అనేనజీవేనాత్మనానుప్రవిశ్యనామరూపే వ్యాకరవాణి (నేను ఈమూఁడు దేవతలను ఈజీవుఁడనెడి శరీరముతోఁజొచ్చి నామరూపములను పర్చుపవలయును) అని అచేతనవస్తువునంతయు నెత్తికొని దానిలో తానాత్మగాఁగలజీవుఁడు ప్రవేశించుటచేత నామరూపవ్యాకరణము చెప్పఁబడినదిగాన, వాచకశబ్దంబులన్నియు అచేతన జీవవిశిష్ట పరమాత్మకే వాచకములుగాన, కారణావస్థగలపరమాత్మను చెప్పెడి శబ్దముతో కార్యమునుజెప్పెడి శబ్దమునకు సామానాధికరణ్యము ముఖ్యముగాఁ గుదిరినది-

౧౫౭. కాఁబట్టి స్థూలసూక్ష్మములైన చేతనాచేతనములు ప్రకారముగాఁగల బ్రహ్మమె కార్యంబును కారణంబునుగాన జగత్తు బ్రహ్మ ముపాదానముగాఁ గలది- సూక్ష్మచేతనాచేతనవస్తువులు శరీరముగాఁగల బ్రహ్మమెకారణము-

౧౫౮. బ్రహ్మ ముపాదానమైనను మొత్తముపాదానముగాన చేతనాచేతనములకును బ్రహ్మంబునకును స్వభావముల సాంకర్యము లేకపోవుటలెస్సగాఁగుదిరినది- తెల్లనివియు నల్లనివియు నెఱ్ఱనివియునగు తంతువులమొత్తముపాదానముగాఁ గలిగి యుండినను చిత్రపటమునకు ఆయాతంతువులప్రదేశమందె తెలుపు మొదలగు వాని సంబంధముగాన కార్యావస్థయందుఁగూడ నంతట వర్ణసాంకర్యము ఎట్లు లేదో అట్లె చేతనా చేతనేశ్వర సంఘాత ముపాదానముగాఁ గలిగి యున్నను జగత్తునకు కార్యావస్థయందుఁగూడ భోక్తృత్వభోగ్యత్వ నియంతృత్వాదులకు సాంకర్యము లేదు- (భోక్తృత్వమనఁగా, ననుభవించువాఁడౌట-అదిజీవునిస్వభావము-భోగ్యత్వమనఁగా ననుభవింపఁబడునదియగుట-అదిఅచేతనస్వభావము- నియంతృత్వమనఁగా నియమించువాఁడౌట- అది ఈశ్వరస్వభావము-) తంతువులు (పోగులు) వేఱుగానుండుటకు తగినవి, అవి నేయువాని యిచ్ఛచేతను కూర్పఁబడినవై కారణత్వమును గార్యత్వమునుబొందును- చేతనాచేతనములో అన్నియవస్థలలోనును పరమపురుషునకు శరీరముగాన పరమపురుషునకు ప్రకారములగుచు నె పదార్థంబులగును- కాఁబట్టి అవి ప్రకారముగాఁగల పరమపురుషుఁడు ఎల్లప్పుడును అన్నిశబ్దములచేతను చెప్పఁబడును- ఇదిమొత్తంతువులకంటె చేతనాచేతనంబులకుఁగలవిశేషము- స్వభావములు వేఱువేఱుగానుండుటయును, వానికిసాంకర్యము లేక పోవుటయును రెంటికిని సమానమె- కాఁగా పరబ్రహ్మము కార్యములలోఁజొచ్చినను స్వరూపమునకు మార్పులేమిగానవికారములేకపోవుట లెస్సగాఁగుదిరినది- స్థూలావస్థలో నామరూపముల ఏర్పాటుగలిగి వేఱువేఱుగానున్న చేతనా చేతనవస్తువులకు ఆత్మగానుండుటను కార్యత్వముగూడ లెస్సగాఁగుదిరినది- కార్యత్వమనఁగా మఱియొకయవస్థగలుగుటయెకదా-

౧౫౯. నిర్గుణశ్రుతులుగూడ పరబ్రహ్మమునకు హేయగుణము
ల(దుర్గుణముల) సంబంధము లేకపోవుటను సందర్శింపుచున్నవి-
(ఛా॥౮॥౭౫౧॥) అపహతపాప్మా విజరోవిమృత్యుర్విశో
కోవిజిఘత్సోపిపాసః (పాపము లేనివాఁడు- ముదిమిలేనివాఁడు- మ
రణము లేనివాఁడు- దుఃఖము లేనివాఁడు- ఆకలిలేనివాఁడు- దప్పిక
లేనివాఁడు) అని దుర్గుణములను నిషేధించి, సత్యకామస్సత్యసంక
ల్పః (సత్యములైనగుణములుగలవాఁడు- సత్యమైనసంకల్పము గల
వాఁడు) అనికల్యాణగుణములను (సుగుణములను) జెప్పుచున్నశ్రుతి
దియె, మిగిలినచోటుల, గుణములులేవని సామాన్యముగాఁ జెప్పుట
హేయగుణములఁ గూర్చినదియని ఏర్పడుచున్నది-

౧౬౦. (      ) జ్ఞానస్వరూపం బ్రహ్మ (బ్రహ్మము జ్ఞా
నస్వరూపమైనది) అనుమాటయును సర్వజ్ఞంబును సర్వశక్తియును
నిఖిలహేయప్రత్యనీక కల్యాణగుణాకరంబును నగుబ్రహ్మము యొక్క
స్వరూపము జ్ఞానముచేతనె నిరూపింపఁదగినదియును, స్వయంప్రకా
శమగుటచే జ్ఞానస్వరూపంబునని చెప్పుకొనుటవలన లెస్సగాఁ
గుదిరినది-

౧౬౧. (ముణ్డ॥౧॥౧॥౯) యస్సర్వజ్ఞస్సర్వవిత్ (ఎవ్వఁడు అ
న్నిటివిధంబుల నెఱింగినవాఁడో, అన్నిటి నెఱింగినవాఁడో) (శ్వేతా॥౬॥
౮ను॥) పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ
(ఈతని శక్తి గొప్పదియును అనేకవిధంబులుగలదియును అని వినఁబ
డుచున్నది- ఈతని జ్ఞానంబును బలంబును వ్యాపారంబును స్వాభా
వికమె) (బృ॥౬॥౫॥౧౫॥) విజ్ఞాతారమరే కేన విజానీయాత్ (ఓ
సీ! తెలిసికొనువానిని దేనిచేతఁ దెలియవలయును) ఈ మొదలగుశ్రుతు
లు తెలిసికొనువాఁడగుటను తెలియఁజేయుచున్నవి-

౧౬౨. (తై॥ఆ॥౨॥౧॥) సత్యం జ్ఞానం (సత్యస్వరూపమై
నది, జ్ఞానస్వరూపమైనది) ఇత్యాదిశ్రుతులు జ్ఞానముచేతనే నిరూ
పింపఁబడునదియు స్వప్రకాశంబు నగుటచే జ్ఞానస్వరూపత్వమును
తెలియఁజేయుచున్నవి-

౧౬౩- (తై॥ఆన॥౬అను॥) సోకామయత బహుస్స్యాం (నేను అనే

కములు కావలయునని ఆయీశ్వరుఁడు సంకల్పించెను) (ఛా॥౬॥౨॥౩॥) తదైక్షత బహుస్యాం (ఆబ్రహ్మము అనేకములు కావలయునని చూచెను) (బృ॥౩॥౪॥౭ ) తన్నామరూపాభ్యామేవ వ్యాక్రియత (ఆబ్రహ్మము నామరూపములచేత వర్ణ్యబడెను) అను శ్రుతులచేత బ్రహ్మమే తనసంకల్పమున విచిత్రస్థావరజంగమరూపముగా అనేకప్రకారము తెయున్నదని చెప్పఁబడినది కాఁబట్టి, అట్లు కాక బ్రహ్మాత్మకముగాని వస్తువులు అనేకములగుట తత్త్వము కాదుగాన (కఠ॥౪॥౧౦॥) మృత్యోస్సమృత్యుమాప్నోతియ ఇహ నానేవపశ్యతి (ఎవ్వఁడు ఇచ్చట అనేకములుగా నుండునట్లు చూచుచున్నాఁడో వాఁడు మృత్యువు పై మృత్యువును పొందుచున్నాఁడు (కఠ॥౪॥౧౧॥) నేహ నానాస్తి కించన (ఇచ్చట పమాత్రమును అనేకమైనది లేదు) (బృహ॥౪॥౪॥౧౪॥) యత్రహి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్తత్కేన కం విజానీయాత్ (ఏస్థితిలో భేదము కనఁబడునో అప్పుడు మఱియొకఁడు మఱియొకఁడానిని చూచును- ఏస్థితిలో వీనికి అంతయు నాత్మయే యయ్యెనో అప్పుడు దేనిచేత దేనిని చూచును? దేనిచేత దేనిని తెలిసికొనును?) ఇత్యాదిశ్రుతులచేతను అది (అబ్రహ్మాత్మక వస్తు నానాత్వము) నిషేధింపఁబడుచున్నది-

(ఛా॥౬॥౨॥౩॥) బహుస్యాం ప్రజాయేయ (నేను అనేకములు కావలయును సృష్టిని పొందవలయును-) ఇత్యాదిశ్రుతిసిద్ధమైన, స్వసంకల్పమున బ్రహ్మము అనేకనామరూపములను పొందుట చేతనైన నానాప్రకారత్వము, నిషేధింపఁబడలేదు-ఆయంశము యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ అను నిషేధవాక్యమునకు మొదటనే (బృ॥౪॥౪॥౬॥) సర్వం తం పరాదాద్యోన్యత్రాత్మనస్సర్వం వేద (ఎవ్వఁడు ఆత్మకంటె వేఱుగా సమస్తమును తెలిసికొనుచున్నాఁడో వానిని సమస్తమును విడుచును) (బృ॥౪॥౪॥౧౦॥) అస్య మహతో భూతస్య నిశ్వసితమేతద్యదృగ్వేదః (ఋగ్వేదమనునది పరికలదో ఇది యీ పెద్దభూతపు ఊర్పికదా) ఇత్యాదిశ్రుతిచేత స్థాపింపఁబడినది-

౧౬౪. ఇట్లు చేతనాచేతనేశ్వరులకు స్వభావస్వరూపభేదము

లను చెప్పెడిశ్రుతులకును కార్యకారణభావమునను (ఈశ్వరుఁడు కా
రణమగుటయు మిగిలినది కార్యమగుటను) కార్యకారణములొకఁటి
యె యగుటను చెప్పెడిశ్రుతులకును విరోధములేకపోవుట, చేతనాచే
తనంబులును పరమాత్మయును ఎల్లప్పుడును శరీరంబు నాత్మయునై
యుండుటయును శరీరమైనచేతనాచేతనములు కారణదశయందు (సృ
ష్ట్యాదియందు) నామరూపముల యేర్పాటుకు తగనివగునట్లు సూక్ష్మ
మైనదశనుపొంది యుండుటయును కార్యదశయందు నామరూపముల
యేర్పాటుకు తగినస్థూలదశను పొందుటయును చెప్పెడి శ్రుతులచేత
నే తెలియఁబడుచున్నది.

౧౬౫. కాఁబట్టి బ్రహ్మమున కజ్ఞానముకలదను వాదంబున
కైనను ఉపాధినిబట్టి బ్రహ్మమునకు భేదముకలిగినదను వాదంబున
కైనను కుయుక్తిమూలంబగు మఱియేవాదంబునకైనను అన్నిశ్రుతుల
కు విరుద్ధమగుదానికి ఎట్లైనను అవకాశము కానఁబడకున్నది.

౧౬౬. వేఱువేఱుస్వభావములు కలిగియున్నట్లు ఆయాప్రసతు
బుచే నేర్పడినవారును, శరీరంబులు నాత్మయునగుటచే ప్రకారంబులు
ను ప్రకారియునుగా శ్రుతులచేతనే తెలియఁబడినవారునగు, చేత
నాచేతనంబులకు నీశ్వరునకును, మఱియొకఁటి శ్రుతిచేత కార్యం
బులును కారణంబునని చెప్పఁబడుటయు, కార్యకారణంబు లొకఁటి
యెయని చెప్పుటయును విరుద్ధము కాదుగదా.

౧౬౭. ఆగ్నేయంబును అగ్నీషోమీయంబును ఉపాంశుయాజం
బును రెండుఐంద్రంబులును ఐంద్రాగ్నంబునని ఆఱుయాగంబులుకలవు.
ఒక్కొక్కయాగమునకొక్కొక్క విధివాక్యముకలదు. వానివలననే ఇవి
యేర్పడుచున్నవిగాన ఆవాక్యములు ఉత్పత్తివాక్యములనఁబడును. ఇ
విగాక (తై॥సం॥౧కాం॥౬ప్ర॥౯అను॥) యఏవంవిద్వాన్ పౌర్ణమా
సీంయజతే (ఇట్లు తెలిసికొనువాఁడెవ్వఁడు పౌర్ణమాసయాగమును చే
యునో) (తై॥సం॥౧కాం॥౬ప్ర॥౯అను॥) యఏవం విద్వానమావా
స్యాంయజతే (ఇట్లు తెలిసికొనువాఁడెవ్వఁడు దర్శయాగమును చేయు
నో) అను రెండువాక్యములుకలవు. అవిఆయాఱుయాగములను మూఁడే
సియాగములనొక్కొక్కమొత్తముచొప్పున రెండుమొత్తములనుగాఁ

జేయుచున్నవి. ఇవిగాక మఱియొక్క వాక్యముకూడకలదు. అదియే
దియన్నను ( )దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామోయ
జేత (స్వర్గమును గోరువాఁడు దర్శయాగంబును పూర్ణమాసయా
గంబును చేయునదియనియర్థము) అనునది. ఇదిఆటింటికిని స్వర్గ
మునుగోరువాని నొకనినె యధికారినిగా నేర్పఱుచుచున్నదిగానన్నా
టింటిని ఒక్కమొత్తమునుగానె చేయుచున్నది.

౧౬౮. ఇట్లే (శ్వేతా॥౧౫॥౧౦మ॥)క్షరంప్రధానమమృతాక్ష
రంహరః (ప్రకృతివికరించునది-మరణములేనివాఁడునువికరింపని —-
టునుజీవుఁడు) (శ్వేతా॥౧౫॥౧౦మ॥)క్షరాత్మానావీశతేదేవఏకః (ఒ
క్కదేవుఁడేక్షరముకునుఅనఁగానచేతనమునునుజీవునినిఫలుచున్నాఁడు)
(తై॥నా॥౧౧౫॥) పతింవిశ్వస్యాత్మేశ్వరమ్ (అంతటికినిఅధిపతి. జీవు
లకుఅధిపతి) (తై॥నా॥౧౧౫॥) ఆత్మానారాయణఃపరః (నారాయణుఁడు
గొప్పయాత్మ) ఇత్యాదివాక్యములు చేతనాచేతనేశ్వరులను వేఱువేఱు
స్వరూపస్వభావములుగలవారినిగాఁ జెప్పుచున్నవి.(సుబా॥౭॥ య
స్యపృథివీశరీరం --- యస్యాత్మాశరీరం --- యస్యావ్యక్తం శరీ
రం --- యస్యాక్షరం శరీరమ్, ఏషసర్వభూతాన్తరాత్మాఽపహ
తపాప్మాదివ్యోదేవ ఏకోనారాయణః (ఎవ్వనికి పృథివి శరీరమో,
ఎవ్వనికి అవ్యక్తముశరీరమో, ఎవ్వనికిఅక్షరము శరీరమో, ఈతఁ
డు సమస్తభూతములకును నంతరాత్మయును పాపసంపర్కము లేని
వాఁడును పరమపదమున నుండువాఁడును ఒకదేవుఁడునగు నా
రాయణుఁడు) ఇత్యాదివాక్యములచేత అన్యయవస్థలలోనను చేత
నాచేతనములు పరమాత్మకు శరీరమనియును పరమాత్మవానికాత్మయ
నియును చెప్పఁబడుచున్నది (ఛా॥౬॥౨॥౧)సదేవసోమ్యేదమగ్రఆసీ
త్ (ఓసోమ్యుఁడా ఈజగత్తుమొదటను సత్తెఅయియుండెను) (ఛా॥
౬॥౮॥౭) ఐతదాత్మ్యమిదంసర్వం (ఇదియంతయు పరమాత్మయా
త్మగాఁగలది) (ఛా॥౩॥౧౪॥౧)సర్వంఖల్విదంబ్రహ్మ (ఇదియంత
యుబ్రహ్మమేకదా) ఇత్యాదివాక్యములు వేఱుగాఁదోఁచుచున్నమూఁడు
వస్తువులునుకారణావస్థగలవాఁడును కార్యావస్థగలవాఁడునగు నొ
క్కపరమాత్మయెయని శరీరియగు (శరీరముకలవాఁడగు) పరమా

త్మనుజెప్పెడి సత్ బ్రహ్మ మొదలగు శబ్దములతోఁదెలియఁజేయు చున్నది-,చేతనా చేతనములకు శరీరియగు పరమాత్మను, పరమాత్మను జెప్పెడిశబ్దములచేఁజెప్పినను విరోధములేదు- ఎట్లన్నను మనుష్యాదిపిండము శరీరముగాఁగల యొకయాత్మను అయమాత్మాసుఖీ (ఈయాత్మసుఖముగలవాఁడు) అనియాత్మనుజెప్పెడి శబ్దము చేఁ జెప్పినయట్లె- అనియింతతోఁజాలింతము-

౧౬౯. బ్రహ్మంబును తానునొకటేయను జ్ఞానముచేతనే యవిద్య నివర్తించుట యుక్తముగానున్నదని చెప్పినదిసరికాదు- బన్ధము పారమార్థికము (సత్యము) గాన జ్ఞానము చేత పోవునది గాదు- పుణ్యపాపములనెడి కర్మముచేఁగలిగినదేవాదిశరీరములలోఁ జొచ్చుటయును దానివలనఁగలిగెడి సుఖదుఃఖానుభవంబుననెడి బంధము మిథ్యయని యెట్లు చెప్పఁజాలుదుము- ఈబంధము నివర్తించుట భక్తిస్వరూపమైన ఉపాసనచేఁబ్రీతినొందిన పరమపురుషునియనుగ్రహముననె కావలసినదని పూర్వమె చెప్పితిమి- మీరొప్పినయైక్యజ్ఞానము ఉన్నదున్నట్లు తెలిసికొనుట కాకపోవుటను మిథ్యారూపము గాన, దానికబంధము మఱియింతివృద్ధిపొందుటయె ఫలము- (విష్ణుపు॥ ౨౦ అ॥) మిథ్యైతదన్యద్ద్రవ్యంహి నైతి తద్ద్రవ్యతాంయతః (మఱియొకవస్తువు ఆవస్తువగుట కుదురదుగాన ఇది [వెనుకఁజెప్పిన యద్వైతము]మిథ్య)అనిశాస్త్రముకలదుగదా- (భగ॥౧౫అ॥౧౭శ్లో॥) ఉత్తమః పురుషస్త్వన్యః (ఉత్తముఁడగు పురుషుఁడువేఱు) అనియును, (శ్వేతా॥౧॥౬) పృథగాత్మానం ప్రేరితారంచమత్వా (ఆత్మనును సర్వప్రేరకునిని వేఱుగాఁదెలిసికొని) అనియును, జీవాత్మకంటె విలక్షణుఁడును ఆజీవాత్మకు అంతర్యామియునగు బ్రహ్మము యొక్క జ్ఞానమె పరమపురుషార్థమగు మోక్షమునకు సాధనమైనది,అనిచెప్పుచున్నదిగదా-

౧౭౦. ఇంతియెకాక నీవంగీకరించిన నివర్తకజ్ఞానము (సంసారమునుపోఁగొట్టెడి బ్రహ్మజ్ఞానము)కూడ మిథ్యయెకాన అదిపోవుటకు మఱియొకనివర్తకను కావలయును- ఈనివర్తకజ్ఞానము, తనకువిరోధియగు భేదములనన్నిటినిపోఁగొట్టి తానుక్షణికముగానత

నంతనె నశించును (జ్ఞానముపుట్టి యొకక్షణముకావేగమె నశించు నని సిద్ధాంతము) అంటిరేని- అనివర్తకజ్ఞానపు స్వరూపంబును దానిపుట్టుకయును దానినాశంబునుగూడ కల్పితములుగాన అనాశమును కల్పించుటయును దానియాధారంబునుగూడ యసత్యమెకాన దానికి మఱియొకట నివర్తకముండవలయును- అనాశము బ్రహ్మస్వరూపమె యంటిరేని అట్లైనచో నివర్తకజ్ఞానముపుట్టుటయె లేకపోవును- దానినాశముండఁగా నది పుట్టఁగూడదుగదా-

౧౪౧. ఇంతియెకాక చిన్మాత్రమైన (జ్ఞానమాత్రమైన) బ్రహ్మముకంటె మిగిలినదంతయును లేదనెడిజ్ఞానమునకుజ్ఞాత యెవ్వఁడు? అనఁగా ఈజ్ఞానమెవ్వనికిఁగలుగునను- అధ్యాసమె (భ్రాంతియె) యంటిరేని, అట్లు చెప్పఁగూడదు- నివర్తింపవలసినదియె యదిగాన అది యీజ్ఞానమునకు కర్తయెట్లగును? బ్రహ్మస్వరూపమె జ్ఞాతయంటిరేని, బ్రహ్మము, ఈనివర్తకజ్ఞానమునకు జ్ఞాతయగుట, స్వాభావికమా, లేక అధ్యాసమువలనఁగలిగినదా? అధ్యాసమువలనఁగలిగినదేని ఈయధ్యాసంబును దీనికిమూలమగు నెకయవిద్యయును నివర్తకజ్ఞానమునకుఁజేరినవిగావుగాన నిలిచియె యుండును- మఱియొకట నివర్తకజ్ఞానము చెప్పినను అదియు నొకటినికి ఒకట దానింగూర్చినదై యుండవలయునుగాన జ్ఞాత కావలసియె యుఁడుటను అనవస్థ కలుగును- బ్రహ్మస్వరూపమే జ్ఞాతయంటిరేని మాసిద్ధాంతమునె యవలంబించినవారగుదురు- నివర్తకజ్ఞానముచే నివర్తింపవలసినవానిలో అనివర్తకజ్ఞానస్వరూపంబును దాని జ్ఞాతయునుగూడ చేరి యుందురంటిరేని, ఈ మాట, భూమితప్ప మిగిలిన దంతయును దేవదత్తునిచే ఛేదింపఁబడినదని చెప్పి ఈనరుకుటలోనే ఆదేవదత్తుఁడునుఆనరుకుటయుఁగూడ ఛేదింపఁబడినవానిలోఁ జేరినవియెయని చెప్పడిమాటవలె, నవ్వఁదగియున్నది- అధ్యస్తుఁడగు (భ్రమమునకు విషయమగు) జ్ఞాత, తన నాశమును కలుగఁజేసెడి నివర్తకజ్ఞానమునకు తాను కర్త కావలసివచ్చును- అట్లు కాఁగూడదు- తననాశమెప్పుడును పురుషార్థముకాదు- (పురుషార్థమనఁగా తనకుకావలయునని పురుషుఁడు కోరఁదగినది) అనాశము బ్రహ్మస్వరూపమె యనియం

గీకరించినచో భేదజ్ఞానము, దానికిమూలమగు నవిద్య, మొదలగువానిని కల్పింపుటయెసందర్భింపదు- ఇట్లు, సైవోపహతునిదుడ్డు దెబ్బలనుగొట్టుటను బోలిన! మాయావాదఖండనము నింతతోఁజాలింతము.

౧౭౨. కాఁగా బంధము (సంసారము) అనాదియైన కర్మప్రవాహమనెడి యజ్ఞానమువలనఁగలిగినదిగాన, దానిని పోఁగొట్టుట వెనుక నిరూపింపఁబడిన జ్ఞానము (భక్తి) వలననె కావలసినది- ఆ జ్ఞాన మెట్లు కలుగునన్నను, ఆత్మస్వరూపజ్ఞానము కలిగియుండఁగా పరమపురుషుని యారాధనముగాఁ బ్రతిదినము నాచరింపఁబడుచుండెడి వర్ణాశ్రమ కర్మములవలనఁ గలుగును. అందు, పట్టికర్మముల ఫలము స్థిరముగానిదియు స్వల్పమైనదియు ననియు, ఫలములనుగోరక పరమపురుషుని యారాధనముగాఁజేసెడి కర్మములు, భక్తిని కలుగఁజేసి దానిద్వారంబున బ్రహ్మస్వరూపానుభవం బనెడి యనంతంబును స్థిరంబునగు ఫలమును గలుగఁజేయునవియనియు, కర్మముల స్వరూపము నెఱింగినంగాని తెలియఁబడదు- కర్మముల కేవలాకారమును (క్రోది ఫలములనిచ్చెడి స్వరూపమును) విడచి వెనుకఁజెప్పిన స్వరూపముతో (పరమపురుషుని యారాధనముగా) నాచరింపవలయునని కూడఁ గర్మస్వరూపము వెలుంగక తెలియదు- కాఁబట్టి కర్మవిచారము కాఁగానే, అది గడచియుండుటనె, బ్రహ్మవిచారము చేయఁదగినది గాన అథ (ఇఁకను), అతః (ఇందువలన) అని సూత్రకారునిచేఁ జెప్పబడెను-

జిజ్ఞాసాధికరణపూర్వపక్షము.

౧. పూర్వపక్షి తలంచునదియేమన్నను- వృద్ధవ్యవహారమునఁగాని శబ్దముయొక్క శక్తి తెలియదు- అనఁగా ఈమాట ఈయర్థమును తెలియఁజేయును అనునంశము తగుమనుష్యులు చేసెడి వాడుకనుబట్టియె తెలిసికొనవలసియున్నది- ఎట్లన్నను గామ్ ఆనయ అను మాటను తగుమనుష్యులు ఆవును తెమ్ము అనునర్థమునందు ప్రయోగించుచున్నారుగాన దానికి అది అర్థమని తెలిసికొనుచున్నాము అట్టి పెద్దల వ్యవహారమెల్లను కార్యమునుద్దేశించినదిగానె కానంబడుచున్నది- అనఁగా నొకఁడు ఒకయావును తనయొద్దకు

రప్పించుటయను కార్యమును ఉద్దేశించి గామ్ ఆనయ (గోవును తెమ్ము) అని ప్రయోగించును. ఇట్లె యందఱు నేకొక్క కార్యము నుద్దేశించియె శబ్దములను ప్రయోగించుచుందురు. అట్టి వ్యవహారములను పట్టియె ఆమాటల యర్థము నెఱుంగనివారు ఆయర్థమును తెలిసికొనవలసి యున్నది. కాఁగా ఏమాటయైనను కార్యముతోఁ జేరని యంశము నర్థముగానఁబడదు. కాఁబట్టి శబ్దమెల్లను కార్యమునె తెలియఁజేయును. వేదముగూడ శబ్దమె కాన అదియును కార్యమునె తెలియఁజేయును. ఆ వేదములో నొకభాగమైన వేదాంతములు అనఁగా ఉపనిషత్తులుగూడ అట్టి యొక కార్యమునె తెలియఁజేయును గాని పరబ్రహ్మమనెడి వస్తువును తెలియఁజేయవు. కాఁబట్టి బ్రహ్మమును తెలిసికొనుటకు ఉపనిషత్తులు సాధకములు కావు.

౨. పుత్రస్తే జాతః (తే పుత్రః=జాతః నీకు కొడుకు పుట్టెను) అని యొకఁడు చెప్పినతోడనె తండ్రికి ముఖవికాసము కలుగును. దానిని ప్రక్కనుండువాఁడు చూచి, ఈమాట సంతోషమును కలుగఁజేసెడి పుత్రోత్పత్తిని చెప్పెననుకొని, సిద్ధమైన యంశమును చెప్పుటయందె శబ్దమునకు సామర్థ్యమును కల్పించునే యన్నను,— ఇట్టి ముఖవికాసమునకు జరుగుచుండునవియు కాఁబోవునవియుఁ గూడ కారణము కావచ్చును. జరిగినవానిలోఁ గూడ మంచిలగ్నమునఁ బుట్టుట, సుఖముగా ప్రసవము జరుగుట మొదలగునవిగూడ హేతువులు కావచ్చును. కాఁబట్టి, ముఖవికాసము, ఎద్దియో యొక యిష్టమైన యంశము ఆతండ్రికి తోఁచియుండుటను తెలియఁజేయును గాని, ఈయంశమని విశేషించి నిర్ధారణము చేయఁజాలదు.

౩. కః కూజతి (ఏది కూయుచున్నది?) అని యొకఁడు ప్రశ్నము చేయఁగా, పికః కూజతి (కోయిలకూయుచున్నది) అని మఱియొకఁడు ఉత్తరము నిచ్చెను. ఇచ్చట కూజతి అనుశబ్దమున కర్థము నెఱింగియుండి కోయిలకూతను వినుచున్న మూడవవాఁడు పికః అనుశబ్దమునకు కోయిల యర్థమని గ్రహించును. ఇట్లె కాష్ఠైః స్థాల్యామ్ ఓదనం పచతి (కఱ్ఱలచేత కుండలో అన్నమును వండుచున్నాఁడు) అని యొకఁడు చెప్పఁగా కాష్ఠైః స్థాల్యామ్ అ

నెడి తృతీయా చతుర్థుల యర్థంబును పచతి యనెడిక్రియాపదము నర్థమునెఱింగినవాఁడు, కాష్ఠశబ్దము కట్టెలను తెలియఁజేయునని యును స్థాలీశబ్దము కుండను తెలియఁజేయు ననియును ఱను కొనునే యనినను, ఇట్టిమొదలనుగూడ పూర్వము తానెఱింగి యున్న మాటలను కార్యమును తెలియఁజేయువానినిగానె యెఱిం గియుండునుగాన ఇఁక తానెఱుఁగఁబోవు మాటలనుగూడ కా ర్యమును తెలియఁజేయువానినిగానె తెలిసికొనును.

౮. ఒకఁడు త్రాడునుచూచి సర్పమనుకొని బెదరును. మఱి యొకఁడు నాయంసర్పః, రజ్జురేషా (అయం సర్పః న=ఇది పా ము కాదు. ఏషారజ్జుః= ఇది త్రాడు) అని చెప్పును. అప్పుడు మొదటి వానికి ఇదిపాముకాదు, త్రాడె, అనితోఁచి బెదరు తీరునే యంటిరే ని, ఱచ్చటఁగూడ కదలికలేనిదనియు విషములేనిదనియు ఇది యచే తనవస్తువు అనియుంగూడ చెప్పినను భయము తీరునుగాన ఇదిసర్పము కాదు, త్రాడు, అని తెలిసికొనుటనె బెదరుతీరినదని నిశ్చయించుటక వకాశములేదు.

౯. ఇది కార్యము (చేయఁదగినది) అని తెలిసినంగానిప్రవర్తిం చుట కలుగదనెడి నియమ మొకఁటి యేర్పడియున్నది. శబ్దము, ప్ర వర్తింపఁజేసెడి యర్థమును తెలియఁజేయునదియని తెలిసినతోడ నె కార్యమనెడిజ్ఞానములేక ప్రవృత్తి కలుగదుగాన నన్నిపదంబులు ను కార్యమునె తెలియఁజేయును. కాఁబట్టి రెండవపదార్థముతోఁ గూడిన తనయర్థమును మాత్రమేపదము తెలియఁజేయదు. (అభిహి తాన్వయవాదంబును అన్వితాభిధానవాదంబునని రెండువాదము లు కలవు. రెంటిటిని విశిష్టాద్వైతు లొప్పియున్నారు. అం దభిహితాన్వయవాదమనఁగానొక్కవాక్యములోనున్నపదములు ప్రత్యేక ప్రత్యేకముగా వానివానియర్థములం దెలియఁజేసి అన్ని యుం జేరి వానివానికిఁగలపరస్పరసంబంధమును చెప్పుననుట. ఎట్ల న్నను, గామానయ అనునప్పుడు గామ్ అనునది గోవును, ఆనయ అ నునది తెచ్చుటనును చెప్పును. రెండును చేర్చిన పిమ్మట గోవునకును ఈ తెచ్చుటకును సంబంధము తెలియును. అనియిట్లు చెప్పుట అభి

హితాన్వయవాదము. ఇట్లు కాక గామ్ అనెడిపదము కవలసినయావునే చెప్పుననియు, ఆనయఅనునది ఆవును తెచ్చుటనే చెప్పుననియు నిట్లు చెప్పుట అన్వితాభిధానవాదము. ఈయన్వితాభిధానవాదమె ఈయధికరణములోని పూర్వపక్షి మతము.)

౬. ఇష్టసాధనతాబుద్ధి యనఁగా ఇది నేనుకోరినదానిని సాధించును అనెడి తెలివి, ప్రవర్తింపఁజేయునదికాదు. అట్లు తెలిసినతరువాత ఇదికార్యము (చేయఁదగినది) అని తెలిసినపైనె ప్రవృత్తి పుట్టును. కావుననె కడచిన పని తనకు ఇష్టసాధనమని తెలిసినను, ముందు కాలాంతరమున కాఁదగినది తనకు ఇష్టమని తెలిసినను మనుష్యుఁడు ప్రవర్తించుటలేదు. ఇప్పుడు చేయఁదగినది అని తెలిసినపైనె ప్రవర్తించును. ఇష్టసాధనమైన యీకార్యము నేను ప్రయత్నముచేసినంగాని సిద్ధింపను, కాఁబట్టి నాప్రయత్నమువలన సిద్ధింపఁదగినది అని తోచునఅను ప్రవర్తింపఁడు. కాఁగా ఇదికార్యము, (ప్రయత్నమున సాధింపఁదగినది) అనెడిజ్ఞానమె ప్రవృత్తికి హేతువు.

౭. ఈప్రవృత్తిని కలుగఁజేయునది యెద్దియో యదియె శబ్దముచేఁ జెప్పఁబడఁదగినది. కాఁబట్టి వేదముచేఁ దెలియఁజేయఁబడునదియు కార్యమె.

౮. కాఁగా నట్టికార్యము కానిబ్రహ్మమును చేరుటయనెడియనంతస్థిరఫలము వేదముచేఁదెలియఁజేయఁబడదు.

౯. ఇదిగాక (ఆపస్త॥ సూ॥) అక్షయ్యగ్ం హవై చాతుర్మాస్యయాజినస్సుకృతం భవతి(చాతుర్మాస్యయాగమును చేయువానికి తరుగులేని పుణ్యము కలుగును) అని కర్మములకె స్థిరఫలమున్నట్లు చెప్పఁబడియున్నది.

౧౦. కాఁబట్టి కర్మఫలములు అల్పాస్థిరములనియును బ్రహ్మజ్ఞానఫలము అనన్తస్థిరమనియును తెలియుటలేదుగాన బ్రహ్మవిచారము నారంభింపనక్కఱలేదు.

సిద్ధాంతము.

౧. ఇఁక నీపూర్వపక్షమునకు సిద్ధాంతము చెప్పఁబడును.

౨. ఈశబ్దమునకు ఇదియర్థమని శబ్దార్థముల సంబంధము

ను తెలిసికొనుటకు లోకమందంతటను సుప్రసిద్ధమైన విధమును కాదని, లోకములో నెవ్వఁడు నెఱుంగని యొకఁ్డయర్థమునే శబ్దములన్నియును తెలియఁజేయుననుటను ప్రామాణికులుమన్నింపరు.

3. ఇట్లుకదా పిల్లవాండ్రు శబ్దార్థ సంబంధములను నిశ్చయింతురు. తల్లి తండ్రి మొదలగువారు, తండ్రి తల్లి మేనమామ మొదలగువారినిగాని, చంద్రుఁడు పశువు మనుష్యులు మృగములు పక్షులు సర్పములు మొదలగువానినిగాని, చేతితోఁజూపి ఆయాశబ్దములను జెప్పి పిల్లలకు నేర్పుదురు. పిల్లవాండ్రును మెల్లమెల్లగా ఆయాశబ్దమును చెప్పినతోడనే ఆయాయర్థము తమకుఁదోఁచుటను బట్టి శబ్దార్థములకు సంబంధమున్నదని తెలిసికొందురు. మఱియే సంబంధంబును కనఁబడకపోవుటవలన బోధకత్వము (ఆయర్థమును తెలియఁజేయునదియగుట) అనెడు సంబంధమున్నదియని తెలిసికొందురు. సంకేతము (ఈశబ్దము ఈయర్థమును చెప్పవలయునని యొకఁ్డనిచే సంకల్పింపఁబడియుండుట) సంబంధమని తోఁచదు. అది ఆసంకేతము చేసినవాఁడితఁడని తెలిసినంగాని తెలియదు. ఆటపైని తమకుఁ దెలియని శబ్దములలో ఈ శబ్దమునకిదియర్థమని పెద్దలచే నేర్పబడి యన్నిశబ్దముల యర్థమును తెలిసికొందురు. ఆటపైని తాముద్దేశించిన యర్థము ఇతరులకుఁ దెలియుటకై వాక్యములను బ్రయోగింతురు.

౪. మఱియొకఁ్డవిధముగాఁగూడ శబ్దార్థసంబంధమును తెలిసికొనుటకు వీలు గలదు. ఒకఁ్డఁడు మఱియొకఁ్డనితో నీతండ్రి సుఖముగా నున్నాఁడు అని దేవదత్తునకు తెలుపుమని చేతిసంజ్ఞ మొదలగుదానిచేత తెలియఁజేయును. వాఁడు నోటి మాటనె నీతండ్రి సుఖముగా నున్నాఁడు అని దేవదత్తునితోఁ జెప్పును. ఈదగ్గర, ఈమాట యర్థము తెలియక, మూగవానివలె చేతిసంజ్ఞను మాత్రము ఎఱిఁగినవాఁ డొకఁడుండును. వాఁడు దేవదత్తునకుఁ దెలియుటకై చెప్పిన వాక్యమును విని, ఈవాక్యము వాఁడు చేసినసంజ్ఞచేఁ దెలియఁజేయఁబడిన యర్థమునే తెలియఁజేయునని నిశ్చయించుకొనును.

౫. కాఁబట్టి కార్యార్థమునందె వ్యుత్పత్తి (శబ్దార్థసంబంధమును తెలిసికొనుట) కలుగుననెడి నిర్బంధమునకు సాధకము కానేరదు.

౬. కాఁబట్టి వేదాంతములు పరినిష్పన్నమైన (కార్యముకాని) పరబ్రహ్మమును తెలియఁజేయును. బ్రహ్మోపాసనము అపరిమితఫలమని కూడఁ దెలియఁజేయును. కాఁబట్టి బ్రహ్మస్వరూపమును నిర్ణయించుటకొఱకైన బ్రహ్మవిచారము చేయఁదగినదియె.

౭. ఒకప్పుడు వేదమునకు కార్యమె యర్థమని యొప్పినను బ్రహ్మవిచారము చేయవలసినదియె. ఎట్లన్నను.

(బృహ॥౪॥౪॥౫) ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః (ఓసీ! పరమాత్మ, చూడఁదగినవాఁడు. వినఁదగినవాఁడు. తలంపఁదగినవాఁడు.)

(ఛా॥౮॥౭॥౧) సోఽన్వేష్టవ్యస్స విజిజ్ఞాసితవ్యః (అతఁడె వెదకఁదగినవాఁడు. అతఁడె విచారింపఁదగినవాఁడు.)

(బృ॥౬॥౪॥౨౧) విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత (తెలిసికొని యుపాసించునది)

(ఛా॥౮॥౧॥౧) దహరోఽస్మిన్నన్తర ఆకాశస్తస్మిన్యదన్తస్తదన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్యమ్ (ఈలోపలను దహరాకాశము అనఁగా బ్రహ్మము కలదు. దానిలో నుండునది ఎద్దియో అదియె అనఁగా నాతని కల్యాణగుణసముదాయమె వెదకఁదగినది. అదియె విచారింపఁదగినది)

(తై॥నా॥౧౦॥అను॥౨౩మ॥) తత్రాపి దహ్రం గగనం విశోకస్తస్మిన్యదన్తస్తదుపాసితవ్యమ్ (దానిలోఁగూడ దుఃఖసంపర్కములేని దహరాకాశముకలదు. దానిలో నేదికలదో అది యుపాసింపవలసినదని ఛాందోగ్యవాక్యమునకు వలెనే యర్థము)

ఇత్యాది శ్రుతులచేత ఉపాసనకార్యము తెలియఁజేయఁబడినది.

౮. దానిని ఆచరించినవానికి ఫలముగా, (తై॥ఆన॥౧॥) బ్రహ్మవిదాప్నోతి పరమ్ (బ్రహ్మమునుపాసించువాఁడు పరమాత్మను చే

రుచున్నాఁడు. అని బ్రహ్మప్రాప్తి అనఁగా పరబ్రహ్మమును చేరుట, చెప్పఁబడుచున్నది. ఆబ్రహ్మమిట్టిదియని తెలియుటకై బ్రహ్మస్వరూపంబును దానివిశేషణములును (కల్యాణగుణములు మొదలగునవి) కూడ నాకార్యమునకే ఉపయోగించుచున్నవి.

౯. ఇట్లు, విధివాక్యమునఁ జెప్పఁబడినదాని ఫలస్వరూపము అర్థవాదమునఁ జెప్పఁబడుట కలదు. ఎట్లన్నను ( ) జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత (స్వర్గముఁ గోరువాఁడు జ్యోతిష్టమయాగమును చేయునది.) అనువిధిలోఁ జెప్పఁబడిన స్వర్గమునకు విశేషణములు (బ్రా॥) యస్మిన్నోష్ణం నశీతం నారతిః (దేనియందు వేడిమిలేదో, చలిలేదో, అరతి యనఁగా ఉల్లాసములేక పోవుటలేదో) అనునర్థవాదముచే నిరూపింపఁబడినది. ఇట్లే (బ్రా॥) రాత్రీరుపేయాత్ (రాత్రిసత్రమును చేయునది) అను విధివాక్యమునకు ఫలము (బ్రా॥) ప్రతితిష్ఠన్తి హవా ఏతే య ఏతా రాత్రీరుపయన్తి (ఈరాత్రిసత్రమును జేయువారు ప్రతిష్ఠను బొందుచున్నారు.) అనునర్థవాదమునఁ జెప్పఁబడినది. ఇట్లే (తై॥ సం॥ ౨ కాం॥ ౬ ప్ర॥ ౧౦ అను) తస్మాద్బ్రాహ్మణాయ నాపగురేత (కాఁబట్టి బ్రాహ్మణునిపైకి చేయిమొదలగుదానిని ఎత్తఁగూడదు. అనఁగా కొట్టఁబోఁగూడదనుట.) అనుదానిచే నిషేధింపఁబడిన అపగోరణమునకు (తై॥ సం॥ ౨ కాం ౬ ప్ర॥ ౧౦ అను॥) యోపగురాతే శతేన యాతయాత్ (ఎవ్వఁడు పైకి ఎత్తునో వానికి నూరు యాతనలు గలుగును) అని యర్థవాదమున ఫలము నిరూపింపఁబడినది.

౧౦. గామానయ ఇత్యాదివాక్యములయందు కూడ కార్యార్థమున వ్యుత్పత్తి కలుగుననుటకు వీలులేదు. ఏలనన్నను నీవు చెప్పెడి కార్యమునునది ఇట్టిదని నిరూపింప శక్యముకాదు.

౧౧. కృతి భావభావి కృత్యుద్దేశ్యము కార్యము అనికదా నీవు చెప్పుదువు (కృతి యనఁగా మనుష్యులోపలఁగలిగెడి ప్రయత్నము అనఁగా పూనిక. దాని భావమనఁగా అది కలుగుట. అది కలిగినవెంటనే కలుగునది కృతిభావభావి. ఇట్టిదై కృతికి ఉద్దేశ్యమగునది.) కృత్యుద్దేశ్యమనఁగా కృతికి కర్మమగునది. కృతికి కర్మమగుట య

నఁగా కృతిచేత(ప్రయత్నము చేసి) పొందుటకు మిక్కిలి యిష్టమై యుండుట. మిక్కిలి యిష్టమగునది సుఖంబును, దుఃఖముకలవానికి ఆదుఃఖముపోవుటయును. సుఖాదికమును గోరెడి పురుషుఁడు తనప్రయత్నమునఁగాని యది సిద్ధింపదని తోచినతోడనె ప్రయత్నముచేయఁ గోరి ప్రవర్తింపుచున్నాఁడు. కాఁబట్టి తాను గోరినది తన ప్రయత్నమున సిద్ధింపఁదగియుండుట కంటె కృత్యుద్దేశ్యత్వమనునది మఱియేదియును కానఁబడదు. మిక్కిలి యిష్టమగుదానికె ఇచ్ఛావిషయత్వంబును (కోరఁబడఁదగుట) ప్రేరకత్వంబును(ప్రవర్తింపఁజేయునదియగుట) అని రెండు ఆకారములు కలవంటివేని, ఆప్రేరకత్వమనునది ప్రయత్నము చేసినచో సిద్ధింపఁదగియుండుటయె. ఆమాత్రముననె ప్రవృత్తి కలుగుచున్నది.

౧౨. కృత్యుద్దేశ్యత్వమనఁగా పురుషున కనుకూలమైయుండుటయని చెప్పఁగూడదు. పురుషున కనుకూలమగునది సుఖమెకాని మఱియొకఁటికాదు. దుఃఖనివృత్తి (దుఃఖము కలుగకుండుట) పురుషునకనుకూలముకాదు. పురుషున కనుకూలమైనది సుఖము, వానికి ప్రతికూలమైనది దుఃఖము, అనియెకదా సుఖదుఃఖముల స్వరూపమును పర్వు లుపవలసియున్నది. దుఃఖము ప్రతికూలముగాన అది నివర్తించుట (లేకపోవుట) యిష్టమగుచున్నది. కాని దుఃఖనివృత్తి యనుకూలమగుటను కాదు. అనుకూలప్రతికూలములులేకుండఁగా తన స్వరూపమున తానుండుట కదా దుఃఖనివృత్తి. కాఁబట్టి సుఖముకాక మిగిలిన క్రియ (పని) మొదలగునవి యనుకూలమగుట సందర్భింపదు. అది దుఃఖ (కష్టము) రూపముగానె యున్నదిగాన, సుఖము కొఱకైనదిగాన ననుకూలమని చెప్పుటకుఁగూడ నవకాశములేదు. సుఖము కొఱకగుటచే దానిని జరిగించుటకు కోరిక మాత్రము కలుగును.

౧౩. కృతికి శేషియై యుండుట కృత్యుద్దేశ్యత్వమనియును చెప్పఁగూడదు. నీపక్షమున శేషిత్వమనఁగా నిట్టిదని నిరూపింపశక్యముకాదు. మఱియొకదాని నుద్దేశించి చేసిన ప్రయత్నమునఁ జేరియుండునది శేషము, ఆయుద్దేశింపఁబడినది శేషి అని యంటివేని- ఇట్లు శేషమగుట కృతికి సందర్భింపదుగాన దానిచే సాధింపఁబడవల

